Hum Tehreek-e- Islami ke
Karkun Kaise Banein (Telugu)

# ఇస్లామీ ఉద్యమం
# కార్యకర్తలు

మూలం

మౌలానా సయ్యద్ జలాలుద్దీన్ ఉమ్రి

అనువాదం

ముహమ్మద్ గౌస్ ఖాన్

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# ఇస్లామీ ఉద్యమం- కార్యకర్తలు

రండి! ఈ ప్రశ్న గురించి ఆలోచించే ముందు దీనికే సంబంధించిన మరో ప్రశ్న గురించి ఆలోచిద్దాం. అదేమిటంటే, "ఇస్లాం ఒక ఉద్యమమా?" దీనికి ఔనని జవాబిస్తే పై ప్రశ్న అర్థవంతమవుతుంది. లేదంటే దానికి అర్థమే ఉండదు. ఇస్లాంను ఒక ఉద్యమమంటే నేటి ఆధునికతా ధ్వజ వాహకులు, కొన్ని మతాలవారి నుండి వ్యతిరేకత ఎదురవుతుంది. ఈనాటి ఆధునిక సమాజం ఇస్లాంను ఒక మతమని, వ్యక్తిగత విషయమని భావిస్తుంది. మతమంటే పూజాపునస్కారాలు, నమాజ్ చేయడం వంటి సంప్రదాయాల కలయిక మాత్రమేనని భావిస్తున్నారు ప్రజలు. మతాన్ని అంగీకరించేవారు దాని ప్రకారం నిరభ్యంతరంగా ఆచరించవచ్చు కాని, జీవితంలోని ఇతర విషయాలతో దానికి ఎలాంటి సంబంధం లేదని, సంబంధం ఉండకూడదని ఈ ఆధునికులు చెబుతున్నారు. ఈనాడు యావత్తు ప్రపంచంలోని సామూహిక, రాజకీయ వ్యవస్థలు "మతం అంటే వ్యక్తుల స్వంత విషయం, సామూహిక జీవితంతో దానికి సంబంధం లేదు" అనే ఆలోచనా దృక్పథంతోనే నడుస్తున్నాయి.

మతం గురించిన ఈ ధోరణి నిజమని నిరూపించడానికి- మతానికి సామూహిక జీవితంతో సంబంధం ఉంటే ప్రపంచం అశాంతి, అలజడు లకు ఆలవాలమవుతుందని చెబుతున్నారు వారు. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే ప్రపంచంలో అశాంతి, అలజడులు రేపేవారే ఇలా అంటున్నారు. ఈనాడు ప్రపంచంలోని చెడులన్నీ మతం ద్వారా

వ్యాపించినవి కావు. నిజం చెప్పాలంటే ఇవన్నీ నాస్తికత్వం, మతవ్యతిరేకతల కారణంగానే జనించిన చేదుఫలాలు. ప్రజలు గత్యంతరంలేక ఈ చేదుఫలాలతోనే పొట్ట నింపుకోవలసిన దుస్థితి ఏర్పడింది.

కొందరు మతస్తులు "మతమనేది అసలు మానసిక పరివర్తన, పవిత్రతల కోసమే ఉంద"నే అభిప్రాయం వ్యక్తపరుస్తున్నారు. మనిషి ప్రపంచ సమస్యలను అధిగమించి, మనసులో కలిగే కోరికలను అణచి వేసినప్పుడే మతానికి ఉన్నత స్థానం లభిస్తుందని భావించి దానికోసం యోగాలు, ఆసనాలు వంటి ప్రత్యేక శ్రమ ప్రారంభించారు. ఆత్మ సంతృప్తి పొందాలనుకునేవారు ప్రపంచాన్ని విడిచి కొండలు, అడవులు, గుహలలోకి వెళ్ళిపోయారు. దీనివల్ల ప్రపంచ వ్యవహారాలను త్యజించే వైరాగ్య వ్యవస్థ అమలులోకి వచ్చింది. ఈ వైఖరి నేటి ఊహాజనిత మతాలకు బలం చేకూర్చింది. ఈ వ్యవస్థ వృద్ధిలోకి రావడానికి అనుకూల వాతావరణం ఏర్పడింది. ఇలా మతాన్ని ఒక్కొక్కరు ఒక్కోవిధంగా సామూహిక జీవితం నుండి వేరుచేశారు. ఇస్లాంను ఒక ఉద్యమం అంటే పైరెండు విధానాలను తప్పుడు విధానాలని మనం పేర్కొంటున్నాం.

ఉద్యమం అంటే ఏదైనా ఒక లక్ష్యం కోసం నడుం బిగించడం, శాయశక్తుల కృషి చెయ్యడం అని అర్థం. ఈ లక్ష్యం ఏ రకానికి చెందినదయితే అదే రకానికి చెందిన ప్రయత్నం జరుగుతుంది. దీనిని కొన్ని ఉదాహరణలతో తెలుసుకోవచ్చు. నేడు మన సమాజంలో అవినీతి, వడ్డీ వ్యాపించి ఉన్నాయి. మీరు వాటికి వ్యతిరేకంగా ఏదైనా సంస్కరణోద్యమం నడపదలిస్తే దానికి ఒక ప్రత్యేకమైన మైదానం ఉంటుంది. విద్యను సర్వసాధారణం చేసే ఉద్యమాన్ని చేపట్టదలిస్తే, దానికి ఒక పరిధి ఉంటుంది. ఏదయినా రాజకీయ ఉద్యమం నడపదలిస్తే, దానికి కూడా ఒక రంగం ఉంటుంది. కానీ ఇస్లాం మానవుని వ్యక్తిగత, సామూహిక జీవితాన్నంతా మార్చదలిచింది. ఇది విశ్వజనీన మహోద్యమం. ఇది మనిషిని తన ఆశలు, కోరికల బానిసత్వం నుండి, వంశం, సంఘాల

బానిసత్వం నుండి, ఆచార సంప్రదాయాల బానిసత్వాల నుండి విముక్తి కలిగించి, మనిషిని ఒకే దేవుని బానిసగా, సేవకుడిగా చేసి ఆయన ఆజ్ఞల్ని మాత్రమే శిరసావహించే పరిపూర్ణ దైవవిధేయుడిగా తయారుచేయ దలిచింది. ఈ ఉద్యమ లక్ష్యం......

أَنِ اعْبُدُوا اللّٰهَ وَاجْتَنِبُوا الطَّاغُوت (نحل ۳۶)

దేవుడిని ఆరాధించండి, తాగూత్ నుండి (షైతాన్ నుండి) దూరంగా ఉండండి.

అది ఈ ప్రకటనతో వస్తుంది.

مالكم من الٰهٍ غيره ఇతను తప్ప మీ ఆరాధ్యుడు ఎవరూ లేరు

اُدخلوا في السّلم كافّة ఇస్లాంలో పూర్తిగా చేరిపోండి.

అది మన సాఫల్యం కోసం దేవుడు, అతని ప్రవక్త(స) ఆదేశాల ఆచరణలను విధిగా నిర్ణయించింది.

اطيعوا الله واطيعو الرّسول لعلّكم ترحمون

"అల్లాహ్ ఆదేశాలను, ప్రవక్త(స)గారి ఆదేశాలను నెరవేర్చండి. మీపై కరుణ కలుగుతుంది."

పద్నాలుగు వందల సంవత్సరాలకు పూర్వం అరబ్ భూభాగంలో ఈ సిద్ధాంతంపై ప్రారంభమైన ఒక ఉద్యమం మొత్తం సమాజంలో ఒక పెద్ద సంచలనాన్ని సృష్టించింది. అది నిర్జీవులను సజీవులుగా చేసింది. నిద్రిస్తున్న వారిని మేల్కొల్పింది. బలహీనులకు శక్తినిచ్చింది. వికలాంగులకు నడక నేర్పింది. కోర్కెలకు బానిసలైన వారిని నిజమైన దైవదాసులుగా మార్చింది. బహుదైవారాధకులకు ఏకేశ్వర సిద్ధాంతంపై నడిపింది. కోరికల వెంట నడిచేవారికి, వాటిని అదుపుచేయడం నేర్పింది. అర్థంపర్థంలేని ఆచార సంప్రదాయాలలో బంధించబడినవారిని, ఒక సజీవమైన శాశ్వతమైన గౌరవ

మర్యాదలు గల ధర్మశాస్త్ర జ్ఞానాన్ని ప్రసాదించింది. ఏ ఆశయం లేకుండా జీవిస్తున్న వారిని ఒక ఆశయం కొరకు సమీకరించింది. దీనివల్ల ఒక సమాజం విప్లవాత్మకమైన ఆలోచనలను తీసుకొని ప్రపంచం నలు మూలలా వ్యాపించింది. చూస్తుండగానే అది ప్రపంచపు ఒక పెద్ద భాగంలో తన విజయ పతాకాన్ని నెలకొల్పింది.

మానవ జీవితానికి ఇస్లాం తెలిపిన హద్దుల ప్రస్తావన చూస్తే, మన ముందు 17,18 శతాబ్దాల మతపరమైన కట్టుబాట్లు కనిపిస్తాయి. వీటివల్ల బుద్ధీజ్ఞానాలకు సంకెళ్ళు, సైన్స్, నాగరికతాభివృద్ధి మార్గంలో అడ్డంకులను నిలపడానికి ప్రయత్నం జరిగింది. దానికోసం చాలా చెడ్డ నిర్బంధపు కార్యక్రమాలు చేయబడ్డాయి. ఇదంతా తప్పుడు అనువాదకులు చేశారు. ఈ నిందారోపణలతో ఇస్లాంకు ఎలాంటి సంబంధం లేదు. ఇస్లాం బుద్ధీ జ్ఞానాలను ఉపయోగించి ఎన్నడూ ఎలాంటి ఆంక్షలు విధించ లేదు. ఇది యదార్థ పరిశోధనా రహదారిని తెరిచి నాగరికతను ముందుకు నడిపించింది. ఇస్లాం మనిషి కామ కోరికలపై నిబంధన చేస్తుంది. తిట్లు తలంపులు మరియు పునాదిరహిత ఆలోచనల నుండి మోక్షాన్ని కలిగిస్తుంది. అసత్య ఆచార సంప్రదాయాలు, అక్రమ బంధాల నుండి సురక్షితంగా ఉంచుతుంది. ఈ నిబంధనలు అభివృద్ధి కోసమేగాని, ఆటంకాలు కావు.

ఇస్లామీయ ఉద్యమం, మతాలపై పేరిపోయిన ఆలోచనలకు వ్యతిరేకంగా ఇస్లామీయ చైతన్యంగల ఆలోచనలను ప్రవేశపెడుతుంది. ఇది దీని యొక్క సంక్షిప్త పరిచయం.

రండి! మనిషి ఈ ఉద్యమ కార్యకర్త ఎందుకు కావాలో చూద్దాం! కాని, ఇక్కడ ఒక విషయాన్ని గురించి తెలియపరచడం మంచిదనిపిస్తుంది. అదేమిటంటే, ఉద్యమంకోసం కొంత సమయాన్ని, కొద్దిపాటి ఉరుకులు పరుగులు ఇంకా దాని పనులలో కొంత సహాయం అందించే ప్రతి వ్యక్తినీ కార్యకర్త అనగలం. కానీ, నేనిప్పుడు ఒక మంచి నమూనా కార్యకర్త గురించి

ఆలోచిస్తున్నాను. నమూనా కార్యకర్త అంటే తన జీవితాన్నంతా ఉద్యమం కొరకు వెచ్చించాలి. దీనికోసమే ఆలోచించాలి. అతని ప్రతి ఉరుకు పరుగు దీనికోసమే కావాలి. ఈ ఆలోచనతో తల్లడిల్లిపోవాలి. ఉద్యమ లాభం కోసం సొంత లాభాలన్నింటిని త్యాగం చెయ్యాలి. అతని శక్తిసామర్థ్యాలు, ధన ప్రాణాలు అన్ని ఉద్యమం కొరకే అంకితం కావాలి. మీరు దీనికోసం కార్యకర్త పరిభాషను తేలికైనదిగా భావించవచ్చు. ఇంకా మరో పరిభాషను ప్రవేశపెట్టవచ్చు కాని ఉద్యమం యొక్క పెద్దపెద్ద సేవలు చేసేవారు కూడా నా దృష్టిలో దాని కార్యకర్తలే అవుతారు.

ఉద్యమ ప్రతి కార్యకర్త కూడా నమూనా కార్యకర్తగా తయారవ డానికి ప్రయత్నం చెయ్యాలి. అతను ఉద్యమ సాధారణ కార్యకర్తేకాదు, నమూనా కార్యకర్త కావాలి. ఉద్యమం యొక్క పెద్దపెద్ద సేవలు చేసే ఆశ, కోరిక, ఆవేశం, తహతహ అతనిలో ఉండాలి.

ఈ ఉద్యమ ఉన్నత నమూనా కార్యకర్తగా తయారవడానికై మనిషి బలమైన ప్రయత్నం చేయవలసి ఉంటుంది. అతనిలో ప్రత్యేకమైన గుణాలు జనించాలి. ఇక్కడ వాటి ప్రస్తావనే జరుగబోతోంది.

ఇస్లామీయ ఉద్యమ ఉత్తమ కార్యకర్తగా తయారవడానికై అతను మొట్టమొదట ఇస్లాంను లోతుగా అధ్యయనం చెయ్యాలి. దానిని బాగా అర్థం చేసుకోవాలి. దాని శాసనాలు ఉద్దేశాలు తెలిసి ఉండాలి. దాని గుణ స్వభావం అతనిలో రంగరించిపోసి ఉండాలి. అతని అనుభవ జ్ఞానం ద్వారా ఇస్లాం యొక్క పూర్తి వ్యాఖ్యాన వివరణ దేవుని వైపు కావాలి. కేవలం ఇస్లాం ద్వారానే సాఫల్యం దొరుకుతుందన్న నమ్మకం కలగాలి. ప్రపంచం తప్పుడు అభిప్రాయాల మంటల్లో మండుతోంది. ఇంకా ఆ తప్పుడు ప్రవర్తన నడవడికలు అతనిని మరణపుటంచుల వరకు పంపింది. తన వద్ద ప్రకాశ వంతమైన యదార్థమున్నదని, అంధకారంలోనున్న ప్రపంచానికి సరైన మార్గాన్ని చూపించగలదని ప్రపంచపు ఏ సిద్ధాంతం కూడా తన నమ్మకాన్ని

నిరూపించలేకపోయింది. ప్రపంచాన్ని అవిశ్వాస అంధకారాన్నుండి దూరం చేసిన దైవప్రవక్తలకు, దైవధర్మంపై పూర్తి నమ్మకం, విశ్వాసం ఉండేది. అప్పుడు వారు కొండలను సైతం పిండి చేయగల, భూమిని సైతం బ్రద్దలు చేయగల బాధ్యతా భారాన్ని మోయగలిగారు. దివ్యఖుర్ఆన్‌లో ప్రవక్త(స) గారి గురించి "ధర్మ ప్రచార బాధ్యత వారి నడుమును విరగ్గొట్టింది." అయినా దేవుడు వారికి నాయకునిగా నిలిపాడు. దీనివల్ల ఈ మార్గంలో నిలకడగా నిలిచి, ఎదురయ్యే కష్టాలను సహించడం వారికి సులభమై పోయింది.

اَلَمْ نَشْرَحْ لَكَ صَدْرَكَ وَوَضَعْنَا عَنْكَ وِزْرَكَ
الَّذِىْٓ اَنْقَضَ ظَهْرَكَ وَرَفَعْنَا لَكَ ذِكْرَكَ (الانشراح: ۱-۴)

**(ఓ ప్రవక్తా) మేము నీ హృదయాన్ని నీ కొరకు తెరవలేదా? నీ నడుమును విరిచేస్తుండిన ఒక పెద్ద భారాన్ని నీపై నుండి దించివేశాము, నీ కొరకు నీ పేరు ప్రఖ్యాతుల్ని ఇనుమడింపజేశాము.**

ఇంతకుముందు కాలంలో ఇస్లాం పేరు చెప్పగానే ఎన్నో రకాల ఆటంకాలు ఎదురయ్యేవి. కాని, దేవుని దయవల్ల ఇప్పుడు అలాంటి పరిస్థితి లేదు. దేవుని దయవల్ల ఎన్నో ఇస్లామీయ ఉద్యమాలు ప్రపంచపు నలుమూలల్లో వ్యాపించి ఇస్లాం యొక్క న్యాయపరమైన విధులను నిర్వహిస్తున్నాయి. ఈ ఉద్యమాలు ధార్మికసేవలను మేలయిన పద్ధతిలో చేశాయి, ఇంకా చేస్తున్నాయి. చాలామంది ఈ ఉద్యమాల భాషా సంప్రదాయాలను స్వీకరించారు. కానీ, వాటి అర్థాన్ని, వాటి అవసరాన్ని పూర్తిగా తమ మెదడు, హృదయాల్లోకి దించలేకపోయారు. ఈ ఉద్యమాల దృష్ట్యా ఇస్లాం ఒక సంపూర్ణ జీవన వ్యవస్థని చెప్పడం చాలా సులభం. కానీ, ఆచరణ చాలా కష్టం. మనిషి స్వభావ నిర్మాణం, సమాజ ఏర్పాటు, ఇంకా ప్రభుత్వ ఏర్పాటును సక్రమ మార్గంలో ఉంచడం ఇస్లాం ద్వారానే సాధ్యపడుతుందన్న వాస్తవాన్ని ఈ ఉద్యమాలు నిర్భయంగా ప్రకటించాయి.

అందువల్ల జీవితపు ప్రతి అంశంపై అధికారపు హక్కు కేవలం దీనికే ఉంది. ఈ ఉద్యమాల సంబంధం వల్ల విప్లవాత్మక ఆలోచనల చర్చ జరిపేవారు మీకు దొరుకుతారు. కాని, వీటి రహస్య చిక్కుల గురించి పూర్తిగా తెలియదు. మత విశ్వాసం, నడవడిక, సాంఘిక జీవితం, ఇంకా పరిపాలన కోసం మేలయిన నియమాలను ఇస్లాం సమకూరుస్తుంది అని ఈ ఉద్యమాలు తెలిపాయి. ఇహపరాల సమస్యలను ఉత్తమ రీతిలో తీరుస్తుంది. అందువల్ల జీవితపు ప్రతి విభాగం దీని ప్రకారమే జరగాలని బుద్ధిమంతుల ప్రోద్బలం. అధికార శక్తిసామర్థ్యాలు దీనినే అంగీకరించాలి. ఈ ఆలోచనతో ఏకీభవించిన తరువాత కూడా జీవితపు అన్ని భాగాలలో ఇస్లాం ఆధిక్యతను నిరూపించేవారు చాలా తక్కువ మంది దొరకుతారు.

ఉద్యమంలో ముఖ్యమైనవారు, సామాన్యులు అందరూ ఉంటారు. ఇందులో సందేహం లేదు. అందువల్ల ఉద్యమంలోని ప్రతి వ్యక్తి ద్వారా ఉన్నతమైన ఆలోచనలను ఆశించలేము. ముఖ్యమైనవారు మార్గదర్శకులుగా ఉంటూ, సామాన్యులకు మార్గదర్శకం వహించాలి. సామాన్య ప్రజలు వెనకుండి నడుస్తారు. విద్య, జ్ఞానము లేకుండా ఈ సున్నిత మార్గదర్శకత్వం వహించడం సాధ్యపడదు. విద్యావేత్తలు ప్రపంచానికి వారి కర్తవ్యాన్ని, కార్యాన్ని తెలియపరుస్తారు. ఇస్లామీయ ఉద్యమ నమూనా కార్యకర్తలు విద్యావేత్తల ఈ వరుసలోనే కనిపించాలి. అందుకు ఇస్లామీయ పుస్తకాల అధ్యయనం చాలా అవసరం. ఈ అధ్యయనానికి రెండు అర్థాలు (భావాలు) ఉన్నాయి. మొదటిది- ఇస్లాం యొక్క సామాన్య అధ్యయనం ఉండాలి. మనిషి తన మౌలిక సమస్యలను, ఉద్దేశాలను, ఉత్తరువులను, ప్రయోజనాల గురించి సంగ్రహంగా పరిచయం చేయ గలిగినంత తెలివి ఉండాలి. కనీసం ఈ మేరకు ఇస్లాం అధ్యయనం కలిగి ఉండటం ఇస్లామీయ ఉద్యమ ప్రతి కార్యకర్తకు చాలా అవసరం. ఎట్టి పరిస్థితులలో కూడా ఇందులో ఏమరుపాటు వహించరాదు. రెండవది- ఇస్లాం యొక్క ప్రత్యేకమైన అధ్యయనం చెయ్యాలి. అంటే ఉన్నతమైన

యోగ్యత, దూరదృష్టిని జనింపజేయాలి. ఇస్లాం యొక్క అన్ని అంశాలలో ఇలాంటి అధ్యయనం, ముఖ్యంగా ఈ కాలంలో చాలా అవసరం. ఇంకా తప్పనిసరి కూడా. నమూనా కార్యకర్తలు సాధారణ అధ్యయనంతోపాటు ఏదయినా ఒక అంశం లేదా భావనలపై గుణాత్మకమైన ఆధిక్యత కలిగి ఉండాలి. తద్వారా వారు ఇస్లాం యొక్క భావాలను, అంశాలను ప్రపంచానికి వివరణాత్మకంగా తెలుపగలరు. దీనికోసం అసాధారణమైన కృషి అవసరమన్నది సుస్పష్టం. ఇప్పుడు నా సంబోధన ముఖ్యంగా అనేక విద్యా మైదానాలలో ఉన్నటువంటి యువకుల గురించి. వారు ఎట్టి పరిస్థితులలోను దీనికి దూరం కాకూడదని నా విన్నపం. ఒక విద్యార్థితో విద్య గురించి మాత్రమే సంభాషణ జరుగగలదు. అతను ఒకవేళ విద్యా రంగంలో ఉత్తీర్ణత సాధించలేకపోతే, ఆ నష్టాన్ని మరే పద్ధతి ద్వారానూ సాధించలేడు.

ఏదయినా ఒక ఉద్యమ కార్యకర్త దానికి ప్రతిరూపం అవుతాడు. ఇస్లామీయ ఉద్యమ కార్యకర్త కూడా దానికి ప్రతిరూపం కావాలి. ఈ ఆచరణను అతడు సాధారణ ప్రజలలో, ప్రముఖులలో, మస్జిద్‌లలో, విద్యాలయాలలో, పాఠశాలలో, కళాశాలలో, రహదారులలో, పార్కులలో, చిన్నాపెద్ద సమూహాలలో ఎట్టకేలకు ప్రతిస్థానంలో, ప్రతి చోటా చూపవలసి ఉంటుంది. ఇంకా తన మాటాముచ్చట్లతో, రచన ప్రసంగాలతో, పత్రికలతో, చర్చలతో సహా తన పరిధిలోగల ప్రతి దానిలో ప్రతిబింబించాలి. ఇంకా తమ ఉద్యమంతో కలయిక, పొంతన ఉన్న ప్రతి దానితో చెయ్యాలి. మీరు ఇస్లాం యొక్క ప్రతి రంగంలో వకీలు, ప్రతిబింబాలుగా నిలవాలి. ప్రపంచపు ప్రతి దిశను ఉద్యమం వైపు త్రిప్పాలి. ప్రతి ఛాలెంజీకి మీ వద్ద జవాబు ఉండాలి. ప్రతి ఆటంకాన్ని ఇస్లాం వెలుగులోనే ఎదుర్కో గలగాలి. ప్రపంచంలో ధర్మసంస్థాపన జరిగేవరకు ఈ సుదీర్ఘకార్యం జరగాలి. ప్రతి చోటా దీని మాటే చెలామణి కావాలి. ఈ అద్భుత ఘన కార్యాన్ని మీరు నిర్వహించాలి. మీరు దీనికోసం సిద్ధంగా ఉన్నారా? ఆలోచించండి.

ఇస్లామీయ ఉద్యమ కార్యకర్త తన జీవితకాలమంతా ఈ ఉద్యమంతో ఏకాభిప్రాయం కలిగి యుండాలి. అతను బాహ్యంగా ఎలా కనపడతాడో అలాగే తన వ్యక్తిగత జీవితంలోనూ కనపడాలి. అతని నడవడికలు, గుణగణాలు, ప్రవర్తనలు, సంబంధాలు ఇంకా అతని వ్యవహారాలన్నీ ఉద్యమం ప్రకారమే ఉండాలి. ఈ సుగుణాలు లోపించినవారు ఈ ఉద్యమానికి సేవలు చేయడం అలా ఉంచి, దాని నింద, అవమానానికి కారణమవుతారు. వాక్కు, ప్రవర్తనల విరుద్ధత వల్ల ప్రతి ఉద్యమానికి నష్టం వాటిల్లుతుంది. ఇస్లామీయ ఉద్యమంలోనూ ఇలా జరగవచ్చు. ఇస్లామీయ ఉద్యమంతో సంబంధం ఉన్న యువకుల లక్షణాలు, ఈ ఉద్యమ దృష్టిప్రకారమే ఉండాలి. నేడు మన దేశం ఇంకా ప్రపంచంలోని యువకుల మేధాసంపత్తులు కలవరపు బాటలో ఉన్నాయి. వారి స్వభావం, నడవడికలకు రుగ్మతల జాడ్యం పట్టింది. వారు అనేక రకాల తప్పుడు కార్యాలలో నిమ్నగమై ఉన్నారు. అల్లరిపనులు, విధ్వంసాలు, దుర్జడతలు, వ్యభిచారం వారిలో చోటు చేసుకున్నాయి. వారిలో పెద్దలపట్ల మర్యాద అంతమైపోయింది. విద్యపట్ల ఆసక్తి తగ్గి పోయింది. వారి సమయమంతా తప్పుడు పనులు, లక్ష్యరహిత పనులలో వృధా అవుతోంది. వారితో వారి తల్లిదండ్రులు కలత చెందుతున్నారు. ఇరుగుపొరుగు వాళ్ళు వ్యాకులత చెందుతున్నారు. ఇంకా అలాంటి వారితో దేశమంతా కలవరపడుతోంది. అలాంటప్పుడు ఒక యువకుడు ఇస్లాం నిజస్వరూపాన్ని ప్రవేశపెట్టి- మంచి నడవడిక, లక్షణాలు కలిగియుండి పెద్దల యెడల మర్యాదగా ఉంటూ, పిల్లలకు ఇబ్బంది పెట్టక, ఇంకా అతని నడవడిక వల్ల తల్లిదండ్రులు, బంధుమిత్రులు, ఇరుగుపొరుగు అందరూ సంతోషంగా ఉంటే, అతని నోటమాట కూడా ప్రసంగమే అయిపోతుంది. అతని మౌనంలో కూడా భావప్రకటనా బలం ఉంటుంది. అతను వేదికపైకి రాకపోయినప్పటికీ వేదికపైన్నే ఉంటాడు. అతని మాటలు ఎదుటివారి చెవుల అడ్డుగోడలను చీల్చుకొని మెదడు, గుండెల్లోకి చొచ్చుకొనిపోతాయి. అతను సత్యంపై ఉన్నాడని, ఇంకా అతను ప్రపం

చాన్ని సత్యంవైపు పిలుస్తున్నాడని అతని ఉనికే సాక్ష్యమిస్తుంది. ఏ కార్యకర్త అయినా ఇంతపెద్ద ఆయుధాన్ని నిరాకరించగలడా? ఒకసారి ఆలోచించండి?

దేవుడు మనిషికి ఎన్నో సామర్థ్యాలను అనుగ్రహించాడు. ఒక యువకుడు వీటితో పరిపూర్ణత సాధిస్తాడు. అతను వెలకట్టలేనంత బలం, సామర్థ్యాలు కలిగి ఉంటాడు. వీటివల్ల అతను వినాశపు పనులు కూడా చెయ్యగలడు. అలాగే నిర్మాణాత్మకమైన సేవలు కూడా. మీరు ఇస్లామీయ ఉద్యమ కార్యకర్తలు. మీ శక్తిసామర్థ్యాలను ఈ ఉద్యమ సేవలో వెచ్చించండి. మీకు ఈ బలం, శక్తి సామర్థ్యాలు వాటికవే లభించలేదు. ఇవి దేవుని అప్పగింత (అమానతు). వీటి గురించి ప్రళయదినాన ప్రశ్నించడం జరుగుతుంది. మీ దగ్గర విద్య ఉంటే విద్య గురించి ప్రశ్నించడం జరుగుతుంది. మీ యవ్వనం గురించి ప్రశ్నించడం జరుగుతుంది. మీకు ధనసంపదలు ఇస్తే వాటి గురించి కూడా ప్రశ్నించడం జరుగుతుంది. హదీసులో ఇలా తెలుపబడింది.

لن تزول قدما ابن آدم حتى يسئل عن خمس عن
عمره فيما افناه وعن شبابه فيما ابلاه وعن
علمه ماذا عمل بما علم وعن ماله من اين
اكتسبه وفيما انفقه (رواه الترمذى)

ప్రళయదినాన మనిషి అయిదు ప్రశ్నలకు జవాబు చెప్పనిదే, అతని పాదాలు ఒక్క అడుగుకూడా ముందుకు కదలలేవు. **1. నీ వయస్సు (జీవితకాలాన్ని)ను ఎలా గడిపావు? 2. యవ్వనాన్ని ఎక్కడ, ఎలా గడిపావు? 3. నీకు తెలిసిన విద్యను ఎంతవరకు అమలుపరిచావు? 4. ధనాన్ని ఎక్కడి నుండి సంపాదించావు? 5. సంపాదించిన ధనాన్ని ఎక్కడ ఖర్చుచేశావు?**

మీకు ఏ సామర్థ్యాలు లభించాయో, వాటితో ఉద్యమానికి ఎంతో అవసరం ఉంది. మీ సామర్థ్యాల కోసం ఉద్యమం ఎంతగానో ఎదురు చూస్తుంది. ఈ ప్రపంచంలో మీ సామర్థ్యాలకు చాలా సంపద లభించ వచ్చు. ఈ ఉద్యమం మీ సామర్థ్యాలకు సరిపడ మూల్యాన్ని చెల్లించలేక పోవచ్చు. కానీ, మీ సామర్థ్యాలకు బజారులో ఎంతో ఖరీదు ఉందని, వాటిని బయట వేలం వేయకండి. ఈ ప్రపంచం, ప్రపంచపు వస్తువులు అవాస్తవమైనవి. మీ శక్తిసామర్థ్యాలు చాలా విలువైనవి. వాటిని వెలకట్ట లేము. అవి ఇక్కడి చిల్లర పైకానికి అమ్మకూడదు. వీటిని ఇక్కడి విలువైన వజ్రాలతో కూడా తూయలేము. మీరిక్కడ వాటి వెలను అంచనా కూడా వెయ్యలేరు. దాని అసలు వెల అల్లాహ్ సమక్షంలో మాత్రమే లభించ గలదు. మీరు ఈ ప్రపంచంలో నష్టపోయారన్న భావనే ఉండదు. అక్కడ మీ ప్రతి కోరికా తీరిపోతుంది.

ఈ ఉద్యమం ఎవరిది? ఇది మీదే. దీని కాళ్ళూ, చేతులూ, అవయ వాలు అన్నీ మీరే. రాబోవు కాలానికి మీరే నాయకులు. దీనిని నడిపే బాధ్యత మీపైనే ఉంది. ముమ్ముందు అది మీ స్వాధీనమైపోతుంది. కాస్త ఆలోచించండి. ఎంతపెద్ద బాధ్యత మీపై మోపబడిందో! గుర్తుంచుకోండి. రాబోవు తరం ఈ ఉద్యమంపైనే ఆధారపడి ఉంది. ఈ ఉద్యమం ప్రపంచంలోని ప్రతి చోటా విస్తరించడానికై బయలుదేరింది. దైవం తలిస్తే ఇది విస్తరించబడుతుంది. మనలో ధర్మంపట్ల నిజమైన జాగృతి కలగాలని, ఇంకా ఈ పనులు మన ద్వారా జరగాలని ప్రార్థిస్తున్నాను.

## ధర్మసంస్థాపన కోసం విద్య ప్రాముఖ్యత

ఇస్లాం ఒక సమగ్ర జీవన విధానం. ఇది మన జీవితమంతా మార్గదర్శిగా ఉంటుంది. ప్రపంచంలోని తతిమ్మా విధానాలన్నీ స్వయం కల్పితాలు, ఇంకా అసత్యమైనవే. మనిషి ఈ వక్ర విధానాలన్నింటినీ విడనాడేలా చేసి దేవుని ఈ భూమిపై, దేవుని సమగ్ర జీవన విధానాన్ని

సంస్థాపించి దాన్ని వ్యాప్తిపరచడం ఇస్లాం ధర్మాన్ని స్వీకరించిన వారి బాధ్యత. ఇదే ధర్మ సంస్థాపన.

ఒకప్పుడు- అంటే ఎంతోకాలం జరుగలేదు. ఈ మధ్యకాలంలో ఇస్లాం సంస్థాపన గురించి ఆలోచనే ఉండేదికాదు. మన వారే దీనిపట్ల ఆశ్చర్యంగా తబ్బిబ్బయి చూసేవారు. అలాగే వినేవారు కూడా. కాని ఇప్పుడు ఆ ఆలోచన మునుపటిలా లేదు. గతంలో అపరిచితంగా ఈ శబ్దం, ఈనాడు ప్రపంచంలో అనేకచోట్ల పునరుజ్జీవమవుతోంది. ఈ భావన సర్వ సామాన్యమవుతోంది. ఇంకా ప్రజలు వివిధ రూపాల్లో సమావేశ మవుతున్నారు.

ధర్మసంస్థాపన కేవలం ఒక ఆవేశపూరిత పిలుపు కానేకాదు. దీనికి బుద్ధిజ్ఞానము లేనిదిగా గాని, తాత్కాలిక ఉల్లాస ప్రదర్శన అని కూడా అనలేం. ఇది గతాన్ని పునరుజ్జీవనం చేయడం కోసం చిన్నపాటి కోరిక, ఆకాంక్ష కానేకాదు. కానీ తప్పుడు సిద్ధాంతాల ఊబిలో కాలుచున్న ఈ ప్రపంచాన్ని సత్యధర్మ ఛత్రచాయలోకి తీసుకొనివచ్చే ఒక ఉన్నతోన్నత ప్రయత్నం.

ధర్మసంస్థాపనా ప్రయత్నం ఎప్పుడు, ఎక్కడ, ఎలాంటి పరిస్థితులలో ప్రారంభమైంది, దాని గురించి ఎంత జ్ఞానం ఉన్నది, అందులో ఎప్పుడు ఎంత అభివృద్ధి జరిగింది, పరిస్థితుల మార్పువల్ల దాని గౌరవ మర్యాదలలో ఏదయినా తేడా కలిగిందా లేదా అన్న ప్రశ్నలన్నింటితో ఇప్పుడు వాదన అనవసరం. నిశ్చయంగా ఇదొక సంఘటన. ఈ దేశంలో ధర్మసంస్థాపనా ప్రయత్నం ప్రారంభమవటానికి, దాని వెనుక ఒక ఆలోచన, తత్వజ్ఞానం ఉంది. పటిష్టమైన నిదర్శనములు, సిద్ధాంతాలు, బలమైన శక్తి ఉంది. అందువల్ల అది ఆలోచించేవారి మనస్సు మేథస్సును తన వైపునకు ఆకర్షించింది. వారే దానిని ముందుకు నడిపిస్తున్నారు. కాని, మొదట్లో ఇది ఏ దృఢ ప్రయత్నంతో ప్రారంభమయిందో, దానిలో ఇప్పుడు ఏమాత్రం

అభివృద్ధి కనిపించడంలేదు. వాస్తవానికి ఈ సుదీర్ఘకాలంలో ప్రతిచోటా ఎంతో ప్రయత్నం జరగవలసింది. దీనికోసం మొదట్లో తెలిపిన నిదర్శనాల పరిజ్ఞానము కూడా బాగా తగ్గిపోయింది. ప్రస్తుతం మన మనస్సుల్లో ఈ నిదర్శనాలు తేజోవంతం కాలేదని అనడంలో తప్పులేదేమో. సమస్యలు, వివాదాల వల్ల మనస్సు కకావికలమై ఆత్మరక్షణకై పారిపోవాలని అను కుంటున్నారు. ధర్మసంస్థాపనా ప్రయత్నం కొరకు ఆలోచనా పరిజ్ఞాన మును తయారుచేసే ప్రాముఖ్యత కనుమరుగైపోతుందన్న ఆలోచన వస్తుంది. ఇంకా ఈ జ్ఞానము చాలాసమస్యలు, పనుల క్రింద నలిగి పోయింది. విద్యాజ్ఞానము లేకుండా ఈ మహత్కార్యాన్ని సాధించలేము.

వాస్తవంగా ఏదయినా సిద్ధాంతాన్ని స్వీకరించి దానిపై దృఢనిశ్చయం కలిగి యుండటం కఠినమైనదే. అందుకు కావలసిన ధైర్యసాహసాలు, శక్తిసామర్థ్యాలు విద్యవల్లే జనిస్తాయి. ఈ ప్రపంచం సిద్ధాంతాల సంచయనం. మనిషి విద్య వల్లే మేలైనదాన్ని ఎంచుకోగలడు. విద్య గట్టిదయి అది విశ్వాసంగా మారిపోతే, అతనిలో పర్వతంలాంటి దృఢ నిశ్చయం, స్థిరత్వం జనిస్తుంది. ఇంకా ఎలాంటి అగ్నిలోకి దూక డానికయినా సిద్ధంగా ఉంటాడు.

విద్య లేకపోతే మనిషి ఒక స్థిరమైన ఆలోచనపై నిలువలేడు. ప్రతికూల ఆలోచనల ఒకే ఒక్క ఉప్పెన (ప్రవాహం)లో కొట్టుకొనిపోతాడు. మరో అడుగు ముందుకేసి ఆలోచిస్తే విద్య ఆవశ్యకత, ప్రాముఖ్యత ఎంతో ఉంది. ధార్మికసందేశం విద్యతో ప్రారంభమవుతుంది. కాబట్టి, ఇతరుల మేలుకోరువారికి విద్య మూల అవసరం. అది పునాది లాంటిది. ఏదయినా సిద్ధాంతాన్ని ప్రపంచం ముందు ఉంచడానికి, దానిని స్వీకరించమని ఆహ్వానించడానికి మనిషి ఈ సిద్ధాంతాన్ని బాగా అర్థం చేసు కోవడమే కాకుండా, దేనిపైనయితే ఈ సిద్ధాంతం ఏర్పడిందో దాని మౌలిక ఆలోచనల గురించి కూడా బాగా తెలిసి ఉండాలి. ఇతరుల మేలుకోరు వాని వద్ద విద్య

ఎంత అధికంగా ఉంటే, అంతే అధికంగా ఈ మార్గంలో ముందుకు దూసుకొని వెళ్ళగలడు. ఎప్పుడయితే విద్య లేకుండాపోతుందో, అప్పుడే అతని పాదాలు నిలిచిపోయి, తన ప్రయాణం నుండి వెనుదిరిగి, ధైర్యాన్ని కూడా కోల్పోయి కూర్చుంటాడనే భయం ఉంది. మిడిమిడి విద్యాజ్ఞానంతో దైవసందేశకార్యం కుంటుబడుతుంది. ఈ సుదీర్ఘ ప్రయాణం ప్రారంభించడం మహత్యంతో కూడుకున్నది. మహత్యమనేది ఎల్లప్పుడూ బహిర్గతం కాదు.

ఎవరయినా మన వాక్కును ఎలాంటి ప్రమాణం లేకుండా మనపై గల ప్రేమాభిమానం, నమ్మకం వల్ల ఒప్పుకుంటే ఒప్పుకోవచ్చు. కాని, మనం చేసే దావా దృష్టాంతంతోనే ముడివడి వుంటుంది. ఇంకా మన దావా ఎంత పెద్దదయితే అంతే పెద్ద ప్రమాణం అవసరమవుతుంది. ప్రపంచ సంప్రదాయం కూడా ఇదే. ధర్మ ప్రచారం చేసే వ్యక్తి విద్యాస్థాయి, ఎదుటి వ్యక్తి విద్యాస్థాయితో సమానంగా లేదా ఇంకా ఎక్కువగానే ఉండాలి. కొద్దోగొప్పో తెలిసిన విషయాలతో నిరక్షరాస్యులు మరియు పూర్తిగా అక్షరాస్యులు కానివారి మధ్య అయితే ఏదో కొంతవరకు సందేశ ప్రచార (దావత్) పనిని చెయ్యగలం. కానీ, విద్యాధికులతో ప్రసంగించడానికి లేదా వారిని సంబోధించడానికి వారి స్థాయిలోనే విద్యాజ్ఞానము కలిగి ఉండాలి. వారికి వారి స్థాయిలోనే ప్రమాణాలు ఇవ్వవలసి ఉంటుంది. పెద్ద విద్యావేత్తను పిలిచేవాడు తన తక్కువస్థాయి విద్యతో సంభాషించలేడు, దానికోసం పిలిచేవాడు స్వయంగా ఆ విద్యావేత్త స్థాయిలో సంభాషించవలసి ఉంటుంది. అలా కాదంటే విద్యావేత్త తన ఉన్నత ఆలోచనతో ఆలోచించలేడు. ఇంకా వక్త మాటలపై శ్రద్ధ చూపలేడు. మనం తక్కువ స్థాయి విద్యాప్రమాణాలు గల వ్యక్తులతో మాత్రమే సంభాషిస్తున్నాము. మనం ఉన్నతస్థాయి విద్యావేత్తల సమూహం వరకు వెళ్ళాలని ప్రయత్నం చేయడంలేదు. మనిషి తనకంటే తక్కువ స్థాయి వ్యక్తులకు ప్రత్యుత్తరం ఇవ్వకుండా చేసి, ఒక అల్పసంతోష జ్ఞానంలో పడిపోతున్నాడు.

ప్రపంచంలోని వారందరి మేథాశక్తి కూడా ఇంతేనని అనుకుంటున్నాడు. అతనింకా తన ప్రమాణాల ప్రాబల్యం వల్ల ప్రతి ఒక్కరినీ లొంగదీసుకోగలనని తలపోస్తున్నాడు. ఇక్కడి నుండే అతని విద్యా ప్రమాణాలు క్షీణించడం ప్రారంభమవుతాయి.

విద్యాభివృద్ధి కోసం, మనిషి తనకంటే ఎక్కువ ప్రమాణాలు గల వ్యక్తులతో ప్రసంగించడానికి సిద్ధం కావలసిన అవసరం ఎంతైనా ఉంది. ఎదుటి వ్యక్తుల నుండి ఎలాంటి సందేహాలు, సమస్యలు ఎదురైనా వాటిని ధీటుగా ఎదుర్కోడానికి, ప్రసంగించే వ్యక్తి ఆలోచనాపరంగా తాను ఎంతో ఉన్నత స్థానంలో స్థిరంగా ఉండాలి. దీనిని కాదని బుద్ధిజ్ఞానాల పరంగానే ప్రపంచంలో ఎలాంటి మార్పును ఆశించలేము.

మనం తయారు చేసిన విద్యా వాతావరణం ఇప్పుడు ఎందుకు మారిపోయింది, ఇంకా మనం పుట్టించిన ఆలోచనా విధానం ఎలా బలహీనపడి పోయిందన్నదే మన ముందున్న ప్రశ్న.

దీనికి సమాధానంగా- మనం మొదట్లో ముఖ్యంగా విద్యపై చర్చించాము. వర్తమాన కాలంలో ఉత్పన్నమైన ప్రశ్నలకు సమాధానమిచ్చాం. ఇంకా విద్యాపరంగా ప్రపంచంలో ఉన్న పొరపాట్లను దూరం చెయ్యడానికి ప్రయత్నం చేశాము. కానీ, ఈ పరంపర ఎక్కువ రోజులు సాగలేకపోయింది. క్రొత్తక్రొత్త విషయాలను స్వీకరించలేక పోయాము. వెనుకటి విషయాలనే వల్లించడం, దానిని సులభతరం చెయ్యడం, దాని వివరణ విశదీకరణ చెయ్యడంలోనే లీనమైపోయాము. ఇది ఎంత పెరిగి పోయిందంటే, చదివేవారిలో విసుగు ప్రారంభమైపోయింది. ఈ విధంగా విద్యా పరిజ్ఞానానికి యోగ్యమైన దిశ దొరకలేదు. దాని అభివృద్ధి, పోషణకు సరియైన సామగ్రి లభించక అది వాడిపోయింది.

విద్యారంగంలో తలపెట్టిన ప్రణాళిక సాగలేకపోయింది. మనం బయలుదేరిన దిశా వేగంలో మందగమనం వచ్చిందన్న విషయం చాలా

వరకు రూఢీ అయింది. వాస్తవానికి వీటి కారణాలను మనం తెలుసు కోవాలి. వాటిని దూరం చెయ్యడానికి క్రొత్త తరహాలో నూతన సంకల్పం మరియు ఉత్సాహంతో ప్రయత్నం జరగాలి. మన సోమరితనాన్ని అంగీకరించినా, ఈ మధ్య కాలంలో విద్యా ఆసక్తి సొంతంగా కుంటు పడింది. కొన్ని నూతన విషయాలు చర్చకు వచ్చాయి. పాత విషయాలతో నూతన విషయాలను కూడా ప్రవేశపెట్టడం జరిగింది. ఏ సమస్యలు, ప్రశ్నలపై కేవలం క్లుప్తంగా సూచనలు చెయ్యగలిగామో, వాటిని వివరణాత్మకంగా సంగ్రహించాము. ప్రమాణాలు అవసరమున్న వాటిని సిద్ధాంతీకరించడం జరిగింది. ఇంకా ఏ కోణంలో స్పష్టమైన జాగరూకత చేయవలసి ఉన్నదో వాటిని స్పష్టపరిచాము. వీటిని శ్రద్ధగా గ్రహించడం వల్ల కొన్ని నూతన కోణాలు ముందుకు వచ్చాయి. వేటివైపు శ్రద్ధలేదో, లేదా శ్రద్ధ తక్కువగా ఉండిందో, వాటివైపు శ్రద్ధ కలిగింది. అన్నిటికంటే పెద్ద విషయం ఏమిటంటే, విద్యపట్ల నమ్మకం ఏర్పడింది. ఈ పనిలో ఆలస్యం చేయటం, దాని ద్వారా పొందవలసినంత లాభాన్ని పొందకపోవడం ఒక రకంగా అపారనష్టమే. ఇంకా ధర్మసంస్థాపనా మార్గంలో ఈ నష్టం భరించరానిది.

కొన్ని సమయాల్లో ఇస్లాంను విద్య మరియు ఆలోచనాపరంగా నిజం చేశాము. దానిని కార్యరూపం దాల్చే పని మాత్రమే మన ముందుంది. కాని, ఇది అనుభవంలేని ఆలోచన. ఈ ప్రపంచం అన్నిరకాల సిద్ధాంతాల సంచయనం. వీటిమధ్య నిరంతరం సంఘర్షణ కొనసాగుతూనే వుంటుంది. ఇంకా ఇక్కడ రోజు రోజుకు ఎప్పటికప్పుడు క్రొత్తక్రొత్త సంఘర్షణలు జరుగుతూ ఉంటాయి. ఏదయినా సిద్ధాంతం సజీవంగా ఉండటానికి తన ఉనికినే కాక, తన శక్తిసామర్థ్యాల నిదర్శనాలను ఎడతెరిపి లేకుండా చూపించవలసి ఉంటుంది. ఏ సిద్ధాంతమయితే అడుగడుగునా తన నిదర్శనాలను చూపగలదో, అదే ఇతర సిద్ధాంతాలపై ప్రాబల్యం వహిస్తుంది.

ప్రతికూల సిద్ధాంతాలు తమ ఓటమిని, అపజయాన్ని సులభంగా ఒప్పుకోవడానికి ఎప్పుడూ అంగీకరించవు. ఈ ప్రపంచంలో చాలా సిద్ధాంతాలు పుట్టుకొస్తున్నాయి. కానీ, సిద్ధాంతాల వివాదములో అపజయాన్ని పొందితే, వాటిని పనికిమాలినవిగా, నిర్జీవమైనవిగా తలచి వాటిని చరిత్రపుటల్లో పూడ్చి పెట్టాల్సివస్తుంది. ఇక్కడ ప్రతి సిద్ధాంతపు నాయకుడు ప్రతిక్షణం చిక్కుముడుల్లో చిక్కుకున్నాడు. అతను ఒక్క క్షణం ఏమరుపాటు వహించినా ఇతర సిద్ధాంతం తనను లోబరుచు కుంటుంది. ఈ విషయంలో చరిత్ర చాలా కఠినంగా వ్యవహరిస్తుంది. ఇది ఎవరికీ పక్షపాతం చూపలేదు. అలాగే ఇప్పుడు కూడాను.

వాస్తవానికి మేము ఒక ఆలోచనాత్మక మహత్కార్యాన్ని చేయ దలిచాము. దాని కోసం సంపూర్ణ విద్యా సన్నాహం అవసరం. ఈ సన్నాహం మతం, తత్వజ్ఞానము, వ్యక్తిత్వం ఇంకా శాస్త్రం వంటి అనేక కోణాల నుండి కావాలి. తప్పుడు సిద్ధాంతాలు విద్య యొక్క శక్తిసామర్థ్యాల వల్ల కుప్పకూలి పోయాయి. అలాంటివే కొన్ని సిద్ధాంతాలు ఇప్పుడు ప్రపంచంలో వ్యాపించి కార్యరూపం దాల్చిఉన్నాయి. మన దగ్గర సత్యధర్మం ఉంది. ఒకవేళ దానిని ఈనాటి విద్యాస్థాయిలో ప్రవేశపెట్ట గలిగితే, ప్రపంచంలోని తప్పుడు సిద్ధాంతాల నల్లని నీడ వీడిపోయి, సత్యధర్మపు కాంతి నలువైపులా వ్యాపించే సమయం ఎక్కువ దూరంలో లేదు.

ఒకవేళ ఈ మైదానంలో మన ప్రయత్నం పరిపూర్ణంగా లేకపోయి, మన బలహీన సాక్ష్యం వల్ల దైవధర్మపు యదార్థాన్ని రూఢీచేయలేకపోతే, ఈ ప్రపంచం సత్యధర్మాన్ని నిరాకరిస్తుందన్న భయం ఉంది. ఇది మనకూ, మనతోపాటు మానవజాతికి ఎంతో పెద్ద నష్టం కాగలదు. అల్లాహ్ ఈ నష్టం నుండి మనందరినీ కాపాడుగాక!

- సమాప్తం -